# లవంక

ఖండకావ్యము

రచన









ఆకెళ్ల

ప్రకాశకులు:

విశ్వకర్మ యువజన గ్రంథాలయము

# నెలవంక

## ఖండకావ్యము

—: రచన :—

ఉభయభాషా ప్రవీణ,

ఆకెళ్ల సుబ్రహ్మణ్యకవిగారు



:: ప్రకాశకులు ::

విశ్వకర్మయువజన గ్రంథాలయము

సికింద్రాబాదు-దక్కన్.

1950

# కృతజ్ఞతలు.



ఆంధ్ర సారస్వతాభ్యుదయానికి, మేము చేయు కృషికి, గ్రంథాలయ వార్షికోత్సవ ప్రథమకుసుమముగా ప్రచురించి, ఆవిష్కార మొనరించుకొనుటకు మేము కోరినంతనే, తాము రచించిన "నెలవంక" ఖండకావ్యము నంకితముగా గ్రంథాలయమున కొసంగినట్టి ఉభయ భాషా ప్రవీణ, ఆకెళ్ళ సుబ్రహ్మణ్య కవి, రాజశ్రీ సాహిత్య కళాపీఠ కార్యదర్శిగారికి, గ్రంథాలయము నుండి కృతజ్ఞత లర్పించుచున్నాము.

శ్రీ వికృతినామ సం॥ర
జ్యేష్ట పూర్ణిమ.

ఇట్లు
విశ్వకర్మ యువజనగ్రంథాలయ
కార్యదర్శి.



# అంకితము

—[•]—

౧

శ్రీల జెలంగు సౌఖ్యమగు । జీవన మంతయు భూతకోటి క
ల్లోలము బాయు శాంతి గను । లుబ్ధపిశాచి గతించుభారతీ
లాలిత రాగరంజిత క । ళామధురమ్మగు విశ్వకర్మ గ్రం
థాలియ వార్షికోత్సవ వి । ధాన మహోదయ మీశ్వరాప్తిగన్.

౨

నా నెలవంక కావ్యకృతి । నంకిత మిత్తును వార్షికోత్సవా
ధానము శిల్పసుందర సు । ధాకృతి చిత్తము పల్లవింప, న
జ్ఞానము బాపు వీరికృషి । శారద చల్లనిచూపు జూడ నీ
మానవలోక మంగళ స । మంత వసంతపు పూర్ణిమాప్రభన్.

3

జలజల పల్కు ప్వాలు శుభ । సాంధ్య రమాకలనాజలంబుతో
కిలకిల నవ్వు కోకిలలు । కేకల తీయదనంబు పున్నమం
బిలబిల లాడు మోముల గ । మించిన యీ సెలయేటి ఆటలో
పల నెలవంక ఆంధ్రజన । పంక్తుల చల్లని పిల్లగాలియౌ.



# నెలవంక



౪

:: గేయం ::

నెలవంక కోలాహలం । కల వింక తెలుగే ఫలం
తెలుగుదేశం మనం । వెలుగురాశిని ధనం
కలిమిలేములలోన । సెలయేటి పూలన్ని
జలజలా రాలినయి । కలకలా నవ్వినయి
    అలుకలో పలుకులు । వలపులో తలపులు
    చెలిమిలో చేర్చుకొ । కలపి మలపినది
    నీలాల నింగిలో । పాలతుంపరలు
    తెలిఛాయ లన్ని । వెలసి నిలచినవి
తెలగాణజగములో । కలకాల స్వాతంత్ర్య
ఫలము లోకాలకే । అలరు నవయుగము.

—[]—

# అంజలి

౧

మూడురంగుల జెండాకు మోకరిల్లి
మా అశోకసమ్రాట్టును మనసు నచ్చి
భారతీయుల స్వాతంత్ర్యఫలము మెచ్చి
అపరబుద్ధుని గాంధీని అంజలింతు.

౨

మానవరంగమందు అప
మాన శుభాగత శాంతిదూత వి
జ్ఞాని కళా రసాకృతి వి
షాద దరిద్ర వినాశవాది నె
హ్రూ నిజదేశభక్తుడు స
హోదర భావసమంతవేది నా
పూనిన కావ్యచంద్రికలు
పూసెద రాగ తరంగ భంగిమన్.

౩

అన్నా ! సుభాసుబాబూ !
ఎన్నో యుగయుగాలు నీకు ఇంపు జనించే
కన్నమ్మ కే యశం బిడ
జన్నావో వీరయువక ! శౌర్యము మెరయన్.

౮

గడగడ లాడిపోయె తన
కండల నెత్తురుచూసి తెల్లవం
గడ గడనక యెదుర్కొన వి
కావిక లాయె నిరంకుశంబు పె
గ్గడ వడకంగ బట్టె తెలు
గయ్యాలు నమ్మలు విస్తువోయి ఓ
క్కెడ జడిపూలు గూర్చిరి సు
కీర్తి ప్రకాశము టంగుటూరికిన్.

౯

అట్టి విశాలమానసు స
హాయము నెంతగ గొంటిమో మముం
బట్టిన బూసు, ఐక్యత, వి
భక్తము సేయు మహాత్మునందు రా
బట్టిన గౌరవార్థి తన
భాగ్యము భోగ్యము దేశసేవకే
పెట్టిన జెట్టినాయకుడు
పేదలపెన్నిధి టంగుటూరియున్.

౧౦

ఓట్లకు పక్కపంచలను
ఒరగిలం గనుబడ్డ ఆంధ్రుడే

కొాట్లను జెంది నాయకత
కాశనుమాత్రము వీడలేక నే
పాట్లకొా మ్రొగ్గి సోదరుల
పాడు నొానర్పగ జంకువీడె తా
కోట్ల గడించి సౌఖ్యమున
కుల్కొను మొండిపదంబు బొందియున్,

౧౧

మన రిపబ్లికు ఇండియాజనుల కెల్ల
అధిపుడై నట్టి విజ్ఞాన మధురహృదయ
బాబు రాజేంద్రు నెంతయో భక్తి నిడుదు
వందనమ్ములు పేదలవాంఛ దీర్ప.

౧౨

వేడినెత్తురు ఆర్యార్ల వెట్టితలలు
బాగుసేయంగ నింకింప బరగి విజయ
కళలు చిందించు సర్దారుగారి కివియె
వల్లభాయిపటేలుకు వందనాలు.

౧౩

చరితము తిరిగి ధరిత్రి
కరముల సంకెలలు విశృంఖలములునై సుం

దరతర స్వాతంత్ర్యంబే
మెరసె తెలంగాణవాణి మేలుకొనంగన్.

౧౪

పతనము జేసి సోదరుల
పాపము గట్టుగొనంగ బుట్టి బల్
వెతలను బెట్టి అభ్యుదయ
విశ్వము జూపని జాతికక్షలం
బతనము జేసి నూతన స
భా భరతాంబరచంద్రికా కళల్
జతనము సేయు డాంధ్రియువ
శక్తి మహోద్ధృత రక్ష నిచ్చుతన్.

౧౫

బలి యైపోయినవారు చూడు డరుగో
బాలేందురేఖా వికా
సలతారాగణమై ధరానరు లహో
స్వాతంత్ర్య యజ్ఞమ్ములో
పల ఆంధ్రీకృతు లంద శౌర్యపటిమా
భాగ్యంబు రాష్ట్రీయ సం
కలనాగీతులు బాడు డెన్నడు సము
త్కంఠా శ్రుతిశ్రావ్యమై.

## ౧౭

ఆశయము తీరని శాంతికి
మనుగడ సహియింపలేక మధురిమ లేకఁ
కనుదవ్వులు పూర్ణ పూర్ణిమ
జనియింపదు కళాసుః మజంతావేళన్.



## 2—గేయం

పరుగిడండి భారతీయ। నరులారా! పడకండీ
కరగిన శీతలగుహలు। ఒరగిన పూర్ణిమరాత్రులు
తరుణాంబరతారకలు। నిరుపేదల వారసులు
మరచిపోండి గత మంతా। మెరపించండి భావి
నరుకువడిన తెలగాణా। చరితము తమిహెచ్చింది......
అరుగరుగో అహంకార। పర విచారవికారులు
కరుణయెండి గుండెలలో। కరుకుతనం చెరలాడీ
చెరిగిపోయి విజ్ఞానం। మురిసినదీ అజ్ఞానం
దరికికూడ రానీక। తరిమికొట్టి నెట్టండీ
చరచర నవయుగకాలం। తరలి మరలుమంటుంటే
నెరసిన తల నేస్తానికి। మరణించే మస్తానికి
గురువందన మెందుకంట। తరుణో మనసెందుకింక
భరతమాత యశోగీతి। బరువుదించి పాడండి
పరుగిడండి విరవిరా। పడకండీ ధీరులార!



# అజంతా

౧౮

3—గేయం

తెలగాణ ప్రజానీకం
కలలుకన్న విజయాంకం
కలపించిన చిత్రకారు
వలపంతా అజంతా

సలసలకాగే నెత్తుట
మలమలమాడే పొత్తిట
జలజల సెలయేటి జల్లు
చలవంతా అజంతా

తెలుగుపాటలోని ఊపి
తెలుగుబొమ్మలోని రూపు
తెలుగుకలం నిలపించిన
తలపంతా అజంతా.

లలితకళాశిల్పానికి
లలనా సౌందర్యానికి
కలనాశాశ్రిదయమునకు
తెలుగుపుంత అజంతా.

బలమున కోటలు గట్టిన
తెలివిని బాటలు తట్టిన
చెలిమిని మాటలు పట్టిన
కలయంతా అజంతా.



# ప్రణయ వేదన

౧౯

## 4—గేయం

చిన్నపోయె నేల మోము। చెప్పరావే చెలియా
తప్పు లేమిటే ?॥
కంటి కాటుకంత తడిసె। కలతయేల సకియా
మెలత లెందుకే ?॥
ముంగురులకు మురుపులేదు। చెంగున నెగిరే వనితా
వంగు లేలనే ?॥
కరుణకరము అరుణకళలు। కరగిపోయె నెలతా
చెరగిపోయెనే ?॥
ఆట పాట మాట లన్ని। నటన సేయవే లలనా
పటము నీయవే ?॥
ఎడదలోని దడదడలు। వెడలవే ముగుదా
ఘడియ తాళవే !॥
నెలవు నీదు నెమ్మోము। నెలవంకకు సరిజాలు
తెలుగుసీమ గని వాలు॥



# నేను—మీరు

౨౦

5—గేయం.

నాకు తాపం
మీకు కోపం
నాకు కలదు
మీకు లేదు
నాది కలము
మీది ఫలము

నన్ను వలచు
మిమ్ము కలచు
నా కవిత్వం
మీకు తత్వం
నేను సత్వం
మీ వశత్వం.

6—గేయం ౨౧

నేను రాజ్యము
నానుకొంటిని
నీవు వ్యాజ్యము
బూనుకొంటివి
నేను వర్తక
దాన మిచ్చితి
నీవు కర్తకు
మాన మిచ్చితి

నేను ఖడ్గము
మేన బట్టితి
నీవు కపటము
మనసు బట్టితి
నేను ప్రాణము
పూనుకొంటిని
నీవు నాకెమె
ప్రాణ మంటివి

నేను స్వార్థము
నీవు త్యాగము.

# తెలంగాణ

౨౨

రంగుబంగరు పంట పొంగులారెడు భూమి
మంటరేగిన ఆకటింటిసీమ

చీనిచీనాంబరా శ్శృంగార మొలికింప
చింపిపేరకు నేడు సిగ్గనింప

విశ్వగీతులు బాడు విజ్ఞానమాధురి
తీగెలు తెగు వీణతీరు చెదరి

గ్రంథాలయాలలో కనకమాంద్యత లేదు
చిమ్మెటల్ తినిపోవ చెదపోదు

ఎంతకాలము కష్టించి యెంత ఫలము
తెచ్చినను పూర్వులందున దేవునందు
మచ్చుకైనను విశ్వాసమన్న లేని
మనకు పౌరుష మేవిధి మనగవచ్చు.

౨౩

కస్తూరి జవ్వాజిగంధ సౌరభ్యము
మురికి వాసనగాగ మారె నేమొ

మాలతీ సంపెంగ మల్లె మొల్లల పూలు
పల్లేరుకాయలై బరగె నేమొ

# 12

కవి పండితామాత్యగణ వేదికాశిలల్
జార చోరాదుల సరసలాయె
రాజకీయాలలో రణదుందుభుల మోత
గుప్తగూడలలోని కూతలాయె

తెలుగునట్టిల్లు తెలగాణవెలుగు వోయి
తిండిగుడ్డల తిప్పల నుండుమనియె
నన్నయన్నటు ఎన్నెన్ని విన్నపాలు
వమ్ముచేయును దైవవశమ్ము గడచె.



# జీవితాలు

౧

ఎన్ని వసంతముల్ మరలి
యేగెనొ పూలవి యెన్ని రాలెనో
ఎన్ని పికాలు కూసెనొకొ
యించుకతీపియు లేనిదాయె నీ
మన్నన గంధ మేమిడును
మానవలోకము యెండిపోయె నిం
కెన్ని వృధా దురాశలకు
నేచిన నేమిటి లాభపద్ధతిన్.

౨

పదిరూకలతో దినమును
పదవులలో నొప్పజెప్ప పదునగు బ్రతుకున్
చదువుకు తిండికి గుడ్డకు
సదనము నారోగ్యములకు చాలక గడపెన్.

౩

మతములు మారి మందమతి
మానవ మంజులమార్గ మంతయున్
జితికిన జాతులే విడచి
చేరెడు వర్గవిధాన కక్షలం

గతికి కులాల మత్సరము
    కాల్చిన ఐక్యత యెట్టులేరులం
బ్రతుకు పరాధికారముల
    పాలన బోయిన భావ మేదికన్.

౨౭

వేదము శాస్త్రముం గళలు
    వేలము వెఱ్ఱిగ దిట్టులొందు సం
పాదన నగ్నచర్మము క
    పాలములందున మట్టిజెందు నీ
వాదన భారతాత్మకు ని
    వాసము కాదని గట్టిబొందు ఇం
కేదియొ పుల్లగూర రుచి
    మేల భవాదృశసంస్కృతీసుధన్.

౨౮

రా విక రావు ఆంధ్రజన
    రాజ్య మహోజ్జ్వల దివ్యగాథలా
జీవిత సుందరాంతరర
    సీకృతదాత్మ మనోహరస్థితు
త్రైవిక లేవు తామస వి
    హీన విచార విరాగభావము
ప్రోవిక తెల్గుసీమ మధు
    పూర్ణము గాదిక భిన్నపద్ధతిన్.

౨౯

తలపులు కాలిపోయి పర
వాలకు పోయి తరాలు జారి యే
పలు పలవించి యెండి అధి
రోహణ మానిన మానవాంతరా
క్షుల కలవంత నిర్ధన ని
శాంత నివాస నిరీహాగర్భము
ల్వాలపుల పోరులోన తెల
వారిన సీమకు తెల్విగల్గునా ?

౩౦

కాంచిన సత్యదీపికల కాంతులు గుప్పున నారిపోయె పే
మాంచిత సత్త్వవాసిత సుమాలు వెలారెను భూపురంధ్రి వీ
వాంచక ధర్మదర్శన మరాతుల పాల్పడిపోయె వాణివీణాధ్వా
రాంచల రాగమాలిక విరాగము జూపెను తెల్గువాడలో.

౩౧

తిరిగిన తిరిగిన తిరిపము
దొరకుటకే శాసనాలు దొర్లెడి భావిన్
మురియగ మురియగ యాటము
జరుగిడుటకు వింత యేల పరువులు మాయన్.

---

# నిలపరా

౩౭

7—గేయం

నిలపరా నిలపరా । ఉలికినీ
శిలలలో కలపరా । కలిమినీ
వలపరా వలపరా । జగతినీ
పలకరా శిల్పాలు । యుగమునా
అలవరా అలవరా । తనువునా
బలవరా భాగ్యాన । ఘనతనా
కులకరా కులకరా । ఫలమునా
కలత నీ కేలరా । కలమునా
ఆలసింపకురా రారా । శిల్పి !
మేలుగూర్చుమురా । నిల్పి
ఇల సృష్టి స్థితి లయా । లకటా
ఎలమి నీ కేలనే చె । లగుటా
వెలితివడబోకురా । విశ్వానా
వెలుగు లిడు శిల్పి । శాశ్వతా
నిలపరా నిలపరా । నీ జాతినీ
తెలుగుసీమను జ్ఞాన । సంగీతినీ.

# శిల్ప సృష్టి

౩౩

పున్నమరేయి వంక లిడి
పొన్నపువు ల్దిలకించు చుక్కలఁ
గన్న నవుంగదోయి కని
కారముతో నెలవంక శిల్పిలో
ఉన్న మహత్త్వసుం డనుచు
ఊయల నూచెడి వాయుమూర్తినిం
జిన్నతనమ్ము సేయకుము
చింతల నొందకు శిల్పిసోదరా!

౩౪

వాణికి వీణ చేసితివి
వాసవుహస్త మలంకరింప వి
న్నాణపు వజ్రి మిచ్చితివి
నాగకులంబు మణుల్ ధరింప ని
ద్రాణజగమ్ము మేల్కొలిపి
రాజుల దుర్గ విచిత్రరూపము
ల్జాణతనాన గూర్చితివి
సారస దేవళస్రష్ట వీవుగా.

3౫

చెక్కిన నాణ్యతా గరిమ
చింద దొకించుక నేవ హత్త్వమో
పక్కన నవ్వినట్టుల స
భాంగణ మంతయు చేర్చుదీవు నీ
యుక్కు ఉలిం గట్టి మహి
మోన్నతశిల్పము ఇంత గట్టిదో
వాక్కులలోన నున్న శుభ
భారతి భావన గట్టిదో గనన్.

3౬

అడుగడుగున నీ వారలు
అడుగిడ ధైర్యంబు లేని అడ్డులు వెట్టన్
అడగి యుగాలకు జాతిని
బడుగునుగా జేయకయ్య భారతశిల్పీ!

3౭

పంచమజాతి యం చనెడి
పల్కుకు శిక్షను వేయు హైందవుల్
పంచమశిల్పు లన్న మిము
పాడు దరిద్రపుమార్గ మీయ మీ
రెంచనియట్టు లిట్టు పడి
యేల విషాదము నొందుచుందురో ? ఈ

వంచన నాశమౌ వెరవు
బాయగ మీయువకుల్ తలంచుడీ!

౩౮

హర్మ్యలు అందలా లాకాశ మంటంగ
అందాన గట్టుట అంతయేన?
బంగారు వెండియు బహు లోహసామగ్రి
సిద్ధ మొనరించెడి చింతయేన?
సౌందర్యవతులైన చానల మేనుల
నగలు గూర్చుట వారిసొగసు కేన?
రాజాధిరాజుల రంగారు భంగిమల్
రాణిల్ల జేయు సరాగమేన?
నీవు నివసించు యింటికి నేర్పులేదు
నీవు తిని యుంచు పాత్రికు నీటులేదు
నీవు వలపించు భార్యకు నెనరులేదు
నీవు రాజుల కడలెడు నీరసుడవు.

౩౯

తెలుపుము తెలుపుము యువకుల
కలుపుము కలుపుము స్వజాతికాలము వచ్చెన్
కలతలు బాయు ద టంచును
నిలుపుము శిల్పాంగరమను నిత్యయుగాలన్.

# కవి - శిల్పి

౪౦

## 8—గేయం

నేను కవిని    నీవు శిల్పివి
నాది కలము    నీది ఉలియ

నేను మనసు    నీవు మేను
నేను రచన    నీవు సూచన

నాది హృదయం నీది వదనం
నాదు కావ్యం    నీదు గేహం

నేను విశ్వం    నీవు విశ్వం
నేను వ్రాస్తా    నీవు పూస్తావ్

నేను నెలవును    నీవు శిలవు
నేను నెలయేరు    నీవు నెలవంక.



# తంత్రినై

౪౧

నీ మధుపూర్ణగానమున
        నిండిన ఖండము మాదుసీమ ఆ
రామము నీదునామము వి
        రాళి త్వదీయగతి ప్రసారమే
కామిత సూక్తికైన కని
        కారము ఆంధ్రసరస్వతీ విపం
చీ! మనసార నామధన
        జీవ మొసంగెద తంత్రినై గనన్.

౪౨

వాడిన పూలకే సుఖ సు
        వాసన లీను త్వదీయశక్తికే
మోడుల జీవితమ్ములును
        మోదమునం జివురించుదు ప్రభన్
వాడల నెల్ల చల్లని వి
        భావరి గూర్తువు తెల్గుతోట నా
నాడు పరీమళమ్ములు గొ
        నంగ రసాత్మకతంత్రి నయ్యెదన్.

౪౩

రాతులగుండెలే కరగి రాగప్రవాహము ముంచుకెత్త సం
గీతము సాహితిం గలపి కేలను గీచి మీటు వీణ ఆం
ధ్రితరులుం గరంబు నిను రేబవళ్లైన శ్రమించి నేర్చు నీ
జాతికి తక్కువౌట నను సంతత దుఃఖిత తంత్రి జేసెడిన్

౪౪

కలకలలందు గాంచిన వికాస హిమాంతర పూర్ణిమా నిశ
వలయ లతాంత సంపద నభాగ్యదశా పరిభుక్తి శేషమై
నిలచె లిహాభ్రితామసమ నిశ్చయ పూర్వయశోప్రబోధమై
కలతల జీవితంబుల సుఖంబులు లేకనె తంత్రి నౌదునా ?

౪౫

అంధతమిస్రబంధుర విహాయసముం బలె నొంటిజీవినై
గంధవిహీన శుష్క సుమకానన మట్టుల నా కవిత్వ ని
ర్బంధము దుస్థితిం బరగి భావలతాకృతి ఛేదనంబు దు
ర్గంధ హృదంతరాళముల రాగముజిమ్మని తంత్రినయ్యెనో

౪౬

జగమే దేవళరూపమై కవితయే జాతీయ సౌగంధమై
యుగమే ఆంధ్రవిపంచిరాగమయమై ఉయ్యాలలూచ న్ననె

జ్ఞ గణాలం బరితుష్టిమాతృపద వైశాల్యంబు బూజించు వి
ద్యగ సారస్వతవీణ ప్రోయుతరి నే తంత్రీదృశంభ క్తిగా.

౪౬

కలరు తెలుంగుసీమ ధనకారులు ఎందరొ ఆంధ్రవాణి వీ
ణలయకు చోటు తక్కువ అనామయులెందరొ వారినెల్లరిం
బలుకుల నాణిముత్తెముల భాతిని మాలల గూర్చ శోకసం
చలనముమాన్ప దెమ్మ పరిచర్యను జేతు కవిత్వతంత్రినై.

౪౭

మన తెలగాణతల్లి నవమంజుల శింజిత పాదనిస్వనాల్
విని తెలివొందినట్టి మధువీథుల బారులు నేటిదాక సం
జనిత రసజ్ఞవీణియలు సత్యహృదంతచరిత్ర జూపు, నే
డును మహనీయులౌ సుతులు డోలలనూతురు తంత్రినై
మనస్.

౪౮

ఈ జగమందు నాకు గల ఈశ్వరి మాతృదృశాంతపాణి నా
మోజు జెలంగ నిల్పిన సుమోదయరాణికవిద్వయాన సం
మోజితవేణి ఆంధ్రియువపూజ్య రసజ్ఞ మనోజ్ఞ నేడు నా
రాజకళాసరస్వతి మెరన్నెలవంక నొసంగె ప్రేమతో.

—★—

# స్నిగ్ధత

౫౦

కవితాశిల్ప కళారసజ్ఞుల కమో
ఘంబైన కాలంబు ఏ
కవియు న్శిల్పియు కంట నీటి నిడరో
కల్యాణ మచ్చోట నా
కవితాకన్యక విశ్వరూప శుభమై
కల్పించు నానందముం
జవి జూడం జనువారు సౌఖ్యపడుతన్
సత్కావ్యమే స్నిగ్ధతన్.

